పక్షపఱంబునన్ వెలుఁగు భారతసంహిత కెల్లఁ బుండరీ
కాక్షుఁ డె వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్నమానవుం
డక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్. 91

ఉ. వ్యాసమునీంద్రసారకరుణాతిశయంబున భారతార్థ ము
ద్భాసిత మైనయట్టినుతభాగ్యనకున్ సకలాగమార్థసం
వాసన మావహిల్లు జనపంక్తులు గీర్తన సేయ శశ్వదు
ల్లాససుఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుఁ డై. 92

వ. అని యిట్లు సమస్తపురాణపారీణుం డైనసూతుండు. 93

చ. పరమపదాప్తిహేతు వగుభారతసంహిత శౌనకాదిభూ
సురవరు లింపుసం గఱఁగుచొప్పునఁ జెప్పిన వారు మోదసం
భరితతఁ బొంది యక్కథకుఁ బ్రీతిగ నర్చితుఁ జేసి రర్థిలిన్
హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁజూడు మెప్పుడున్. 94

ఉ. పావన దుర్ధశాపహ శుభప్రదమూర్తి సుధానుభూతిసం
జీవితభక్తలోక తులసీదళదామ కపాలమాలికా
భావిభవాభిరామ పరిపక్వతపఃఫలరూప సాంఖ్యవి
ద్యావహయోగశక్తివిశదాద్భుతఖేలన లోకపాలనా. 95

క. దేవాదిచతుర్విధభూతావాసా సుకృతహృదయ హరివిలాసా
కేవలభావానందమయా వేదవ్యాసవర్ణనాగూఢదయా. 96

మాలిని. అకృతకమధురోక్తివ్యాప్తసందీప్తహారా
సకలభువనరక్షాశాలిశుంభద్విహారా
శుకజనకమునీశాశుద్ధబుద్ధానుభావా
సకృపకృతవిలాసా సంభృతానందభావా. 97

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతమునందలి స్వర్గారోహణపర్వంబు సర్వంబు నేకాశ్వాసము. 98

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము

సం పూ ర్ణ ము.

శ్లో. యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు య ద్భవేత్,
త త్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

---

చెన్నపురి : వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము.—1917.